మతివినఁబోఁడు కొండెములమారినుడుల్, కడుసంతసంబునన్
దొరతనమిచ్చు చేతనముతోఁ బరితృప్తివహించు నాతఁడున్.

గీ॥ తనకు సర్కారొసంగెడు దారిబత్తె
మునకు ఘోషాలనొదుగు శాసనమొనర్చి
వడవయజమానులన్ బండివాళ్ళఁబట్టఁ
గొట్టి యుచితప్రయాణముఁగోరఁ డతఁడు.

కం॥ తాలూకాలోఁగల కర
ణాలను మునసబుల నొక్కనాఁడాతఁడు పే
శోలగముఁగూడఁ బిలుచుచు
నీలీలవచించె మోసులెత్త వినయమున్,

## —♦ బేగడ-చతురశ్రగతి ♦—

ప॥ అన్నలార! నాసేయువిన్నపం-బవధరింపుఁడొకమాట ॥అ॥

అ॥ ప॥ కన్నతండ్రులై బిడ్డలటు సేద్య-గాండ్రనేలవలె మీ ॥ర॥

మి॥ మన్ననలతోడ నవాబుకడ నా-మాటఁదక్కింప నొకరోజుముందు
పన్నులువసూలుఁజేసిపంపు నే-ర్పరితనముఁజూపమిము మెచ్చుకొం॥ద

(1) రామభక్తి భవముక్తికేర్పడిన-రాజబాటకద వినుఁడీ
వ్యామోహంబులఁజిక్కక తత్ప్రభు-శ్వర్యకృప హాయిమనుఁడీ
కామితములతో మీయమూల్యమా-కాలమున్ రిత్తగాఁగడుపఁబోక
రామకోటిరచియించి జన్మసా-ర్థకతఁబొంది తరియించెదరుగాక ॥అ॥

సీ॥ దేశికబ్రహ్మోపదేశమున్ దనసాటి
రానట్టి మేటి శ్రీరామకోటి
ప్రవిమలజ్ఞాన ధూర్వహులఁ జిదానంద
రతిఁదేల్చుబోటి శ్రీరామకోటి
దారిద్ర్యకలితసంతాపమెంతయుఁ బాపు
రతనాలపేటి శ్రీరామకోటి

రమణీయమోక్ష సామ్రాజ్యమాశ్రితులఁ జే
ర్పఁగఁ దుదిచీటి శ్రీరామకోటి.

గీ॥ బళిరె! యేతాదృశపరిభావమున నలరు
రామకోటిరచించి, తారకమహత్వ
సిద్ధిఁదరియింపుఁడయ్య ప్రసిద్ధిమీర
సారమతులార! గ్రామాధికారులార!!

ఉ॥ కంటిరె రామునాలయ మొకండును నక్కట యిట్టిదుస్థితి౯
మంటినిఁగూలుచుండ నవమానముకాదె? పవిత్రచిత్తులై
యుంటకు మీమనంబు లెటులొప్పెను! నాకిపుడూతనిల్చి మే
ముంటిమనుండుచాలుఁ బునరుద్ధరణంబొనరింతు నెట్టులో.

మ॥ వినియేయుందురుమీరు పూర్వకథ, నివ్విట౯ మహాభక్తరా
లని కీర్తిన్వహించి రాఘవు ననుజ్ఞాప్తిఁ గట్టించె దీ
నిని „దమ్మక్క'' ధనప్రదాతలగు మన్నీలెందరో సాయమా
త్మను, నేడియ్యదికూలుచుండ నొరకాటంబొంద బోఁడొక్కఁడు౯

మ॥ విడఁబోనియ్యదె దీక్షఁబూనితిని; నిర్విఘ్నంబుగాఁ గార్యమే
ర్పడసాధించెదఁ, గష్టనిష్ఠురము లెప్పాట౯ విజృంభించిన౯
దడబాటొందను, రాముఁడేగలఁడు, చూడామెందుచేఁగాదొ! మీ
రుడుతాభక్తిని గూర్చితెండిటకు నింతో, యంతొ, సద్భావులై.

## సావేరి–రూపకము

ప॥ పోవునపుడు వెంట గడ్డి-పోచయైనరాదు ॥పో॥

అ॥ ప॥ భావింపఁగజ్ఞానికిఁ దా-పత్రియంబెచేసు ॥పో॥

మి॥ ఈవిధి నాభార్యయిద్ది,-నావిత్తము నాకొడుకని
దేవులాట పునర్జన్మ-కైవసమైనర్చుకొనుబాట ॥పో॥

(1) కూడఁబెట్టుపుణ్యమొకటె-తోడునీడ మనకు
వీడను మృత్యువా! మనల-నేఁడోరేపో చెనకు

పాడిసెదక రామునిపద-పంకజయుగమాత్రఁగొనుం
డీడ దీపముండఁగ నే-యిలుఁజక్క-దిద్దుకొనఁజనుఁడు ॥పా॥

ఉ॥ కన్నులపండువయ్యెఁ దృటికాలమునిల్వని యింద్రచాపమే
తెన్నన మాయమైచను, నదేక్రియ నేర్పున రెప్పపాటులో
వన్నెలు చిన్నెలెన్నొ కనఁబర్చి, యశాశ్వతమైనకల్మి, తా
నున్నటులుండి దాటునెటకో మనయాసల నీసడించుచున్.

వ॥ అవధరింపుఁడట్లు-నిష్కామయోగోపన్యాసధోరణిన్-శ్రోతల ఋజుమార్గప్రవర్తకులఁజేసి-రామాలయపునరుద్ధరణదీక్షన్ బద్ధకంకణుండై మోక్షమార్గనిరోధకంబులుగాని, గుప్తదానంబుల స్వీకరింపుచు-భక్తిరసానుకూలంబున జానపదులొసంగు నల్పవిరాళంబులఁ దృణీకరింపక-కృతజ్ఞతాపూర్వకంబుగ నందుకొనుచు - నొకశుభముహూర్తంబున-శంఖుస్థాపనమొనర్చి-పునీతమంత్రిరాజిన్ బాలితంబై, యంత్రబద్ధంబగు మూలవిరాట్ప్రతిష్ఠజోలిఁబోక-తత్కర్జంబులఁదీర్ప నిశ్చయించి-తమకిట్టుబాటున కిరుసుడంగులఁ గార్యసా[illegible]న్ బ్రదర్శించు మేస్త్రిల నియమించి-వలయుసామగ్రి య[illegible]బాటులోనుండునట్లు కట్టుదిట్టంబుల నెరపుచున్నంత-గౌతమీనదీతీరంబున నెయ్యెడఁ బరికింపుఁడు జాలనిండునొకతే!-ఎచ్చోటఁజూడుఁడు. దారునిచయపరిపూర్ణజలయానంబులే!- నిముసమూగుఁడు-చక్రికిరీటౌన్నత్యంబున, గగనప్రతిరుద్ధదినేశమార్గయై-యపరంజి మైపూతన్- దళ్కునిగ్గులఁ గుమ్మరించుచు-గాలితాకున నూగాడు చిఱుగంటలసవ్వడిన్-మనల స్వాగతగీతమ్ముల నాహ్వానించుచున్న దదినూత్నధ్వజస్తంభంబుఁబోలు!-నదుండట నేమివిశేషములఁగందుమో!-ఆశ్చర్యమాశ్చర్యము!-నిన్నటి కలిగజమైన తేవనియాప్రాకారం బింతలోనింతయెత్తు పెరిగిన దీపనివాండ్రింద్రజాలికులో యనువారును-జాగ్రత్తగ సోపానముల లెక్కించుకొనుచు రం, డిది చిత్రకూటాఖ్యన్నగడు దేవస్థానకార్యాలయమనువారును-చూడుండిల్లిదే గోపురసింహద్వారము దీని నతిక్రమింప, నదో-సుదర్శనమారిన్ జారయు రామాలయము-ఆ దానిఁ జుట్టిరాఁజూపట్టు విశాలప్రదేశమున కిరుగెలంకులఁగల విలాసమంటపంబులనఁటి నెలకొన్నవి పన్నిద్రాళ్వారుల నికేతనంబులా?

సరిసరి!-ప్రదక్షిణమాచరించితి, మిఁక దేవదర్శన మొనరింతము-ఇప్పుడు మనముచేరుకొన్నది ముఖమండపము-దీనిని దాటి నంతరాళిక, మా పైన గర్భాలయమను వారును-సార్థకజన్ములమైతిమి ఆహా!-శ్రీరామచంద్రుండదే-ధృవకౌతుకోత్సవస్నపనబేరంబుల-నర్చావతారరూపుండై, యెటుల కనుపండువొనఁగూర్చుచున్నాఁడో! యని, భక్తిభావం బుట్టిపడ, సాష్టాంగదండప్రణామమాచరించి లేచి తీర్థప్రసాదంబు లందుకొనువారును-స్వామీ! అదియా పచ్చలపతకం, బదియా ముత్యాలహారంబని-వివిధాభరణక్రమంబర్చకులనడిగి తెలిసికొని-యానందపారవశ్యమున మైమఱచువారును-ఈప్రక్క రామునకుఁ బలుఁదోము ఊకొట్టు-మాచక్క సీతారాములు పవ్వళించు పర్యంకాగారమేమి వైభవము! భద్రాద్రి కలియుగవైకుంఠమాయెనే యని, హావబాష్పము లొలికించువారును-వీక్షింపుఁడా దెసఁ దిరుకంటపల్లి చేరువ నాగంతకులకు విడిది-ఈతావునఁ బుష్పోద్యానము-బళిరా! ఓనానా! రాఘవుని తేరు, గరుడవాహనము, చక్కనిపురము-రెడలెగని [illegible]మూల్యవస్తుసందర్శనమ్మున, కీరెండుకండ్లు చాలకున్నవే!-ఈమం[illegible]లాధికారి సాక్షాదవతారపూరుషుండు, ముముక్షువుగాని, సామాన్యమానవుఁడా? యని మెచ్చుకొనువారును, మొదలుగాఁగల-జనతండంబుల పొగడ్తలకలరక-గోపన్న సఫలీకృతమనోరథుండై-తత్క్రియాచరణావేశంబున-సర్కారు పైకమూలమునకు తెచ్చించిన నిజస్వాతంత్ర్యమున కరవాయిఁగొనక-ఇష్టదైవముగ్రీ హామాసించి-లెక్కకు మిక్కుటమ్మగు సమారాధనలొనరించుచుండ.

చ॥ పలుకరముల్ పదార్థములఁ బండినచేలటునిండి, కమ్మతా
వుల వెదఁజల్లు విసరులపోడిమి క్షుత్పరితాపమార్పు నె
చ్చెలిగతి భోక్త లెంచి పరిషేచనఁజేసెడివేళ, న[illegible]
గలిగెవిపత్తొకండు, పరికల్పిత దైవపరీక్షయో యనన్.

గీ॥ తోడిబుడుతలఁగూడి, యాటాడుకొనుచు
రభసవృత్తి నకట రఘురాముఁడాత్మ
కర్మవశమున నొక వేడిగంజిగుంటఁ
బడియెఁ బడుటయె తడవుగ విడిచె నుసురు.

గీ తల్లికన్నను గుర్మైనదాగుణంబు
కాని, పతిచేయుసత్కార్యహానికడలి
పొంగిపార లెడు దుఃఖ మాపుకొనిరొకట
మరుగుపఱచెను తచ్ఛ్రవమానుశీల.

చ॥ కడుకఁడి హృత్తలం బదురఁగాఁజను నూర్ధ్వపరాగమందు తా
నడఁగుచు దొడ్డుఁదీయు నసహాయవిషాదజవాశ్వ మోసరి
ల్లెడుగతిఁ దోఁచదే! నిలువరింపఁగ నోరిమిపేరివాగె యా
బిడ కరసంగతంబయి నిపీడితమైన నదేమిచిత్రమో.

గీ॥ భోక్తృభోజననాటకమ్మునకు భరత
వాక్యమనఁజెల్లి, శ్రేష్ఠసవ్యదులఁగలసి
వినఁబడెను „రామారమణగోవిందహరి'' య
టన్నగంభీరఘోష మాశాంతమగుచు.

గీ॥ ముగిసెశుభరూపకమ్మటు భోక్తలలర
సుతవియోగార్తి రామదాసునిపడంతి
నాందివాచకము విషాదనాటికకు ను
పక్రమించెను జాలు నీర్వారనిట్లు.

## — ♦ సారమతి-చతురశ్రగతి ♦ —

ప॥ కనుగొనవేల? కమనీయఫాల-యనుపమశీల! వినయాలవాల ॥క॥

అ॥ ప॥ జననీజనకుల మనములురంజిల-నినుగాంచినఫలమును నిడుధీబల॥క॥

(1) కోమలగాత్ర! కువలయనేత్ర!-మామకపుత్ర! తామసజైత్ర
కామించెనేకలి? రాముఁడునరబలి-తామసమునఁదొలినీమముగాఁబలి॥క

సీ॥ బిలిబిలిపలుకు తేనెల నొలికించు వా
తెఱ క్రొవ్విరుల కుపదేష్టగాఁగ
సాత్త్వికతేజఃప్రసారసారాంచిత
నయనముల్ తబసిమున్నవలనంద

రఘురామవిగ్రహారాధనాకర కర
ద్వయి నాస్తికాళి సంభ్రమమడంప
చుఱుకుఁదనాన కేళ్ళుఱుకుపదములు మృ
గార్భకమ్ములకు నాట్యకళ నేర్ప.

గీ॥ నింద్రధనువును బోలి నీవిన్నివన్నె
లిన్ని చిన్నెలఁ జూపి, యిదేండ్లలోనె
కడుపుకొంటివె నూరేండ్లగడుపుతండ్రి!
కనెదె రెక్కలనక్కొ దిక్కులేనమమ్ము?

గీ॥ కడుపుచిచ్చిడిపోతివే కన్నకొడుక
పలుకవేమని గుండెలు బాదుకొనుచు
గోడుగోడున నేడ్చు నాకోమలిఁగని
పలికె నూరటఁగూర్చు గోపన్న యిట్లు.

మ॥ విలపింపన్ ఫలమేమి తాల్మిఁగనఁ దన్వీ! దిక్కు శ్రీరాముఁడే
కలఁడన్నింటికి, నమ్మ మెన్నటికి, వేగన్ లెమ్మ, రారమ్మ, కో
సలకుంబోదము; వానిముందిడి సుతప్రేతమ్ము "ఏపాట్లు రా
వలె నేమా" కని మొఱ్ఱఁ బెట్టుకొనఁ జూపంబోదె మోమోటమిన్!

## మంజరి—కన్నడ

అతులధైర్యమున న్నాభాగవతుం-డంగన నటులోదార్చి
మృతకళేబరము రామునిపాద-ద్వితయసన్నిధిఁ జేర్చి
తారకనామపునశ్చరణంబునఁ-దన్మయత్వముఁ గాంచి
తేరుకొనిమఱల ప్రార్థించెనిట్లు-దీనత నాదలవంచి.

## కదనకుతూహలం—చతురశ్రగతి

ప॥ చలమేలఁజేసేవయ్యా రామ!-సాకేతధామ సత్సార్వభౌమ ॥చ॥
అ॥ప॥ కులదీపకుండగు నొక్క-సుతుఁ-బాలియింపన్యాయమా? [illegible] ॥చ

(1) నినునమ్మికొల్చినదానికీ-యనుభవమ్మేఫలమౌనా! జ్ఞానాధీన!
దనుజారి! నీసేవను వీనినిల్పు-కొనవేమి? దీవెననోమి, సామీ! ॥చ॥

శా॥ మాయాతీతుఁడ వీ, వసాధ్యమెదిరామా! నీకు? మున్నొక్కచోఁ
బ్రాయంపుంబుడుతం డయోధ్యవిగతప్రాణుండుగాఁగుయ్యొమొ
ఱ్ఱో, యంచుఁ విలపించు తజ్జనకుఁడెంతో మోదముంజెంద నాఁ
డాయుర్దానమొసంగి ప్రోచితివి కాదా! వానిధర్మార్థిపై.

గీ॥ అద్దికల్పితగాథయో!, అసలునిజమొ!
నిర్ణయింపఁగఁజాల; దానినిపుడీవు
సత్యమని ఋజువుసేయఁగా శక్తియున్న
నేదిచూతము బ్రదికించు మీకుమారు.

కం॥ అనివేడుట తడవుగ రా
మునిమహిమం బేమొ నిదురఁబోయి మెలకువన్
గనురీతి లేచెగోపన
తనయుఁడు చూపఱకు నద్భుతంబుఘటిల్లన్

గీ॥ గురుదశతొలంగెనిఁక శనైశ్చరుఁడు తనత
డాకఁజూపింపఁదొడఁగె ననేకగతుల
రామదాసునకున్ మేనమామలిట్లు
వ్రాసిరొకజాబు తిరుగజవాబుఁగోరి.

—♦ కన్నడదర్బారు-త్రిశ్రజాతిత్రిపుట ♦—

ప॥ వింటివా? నీభావిసౌఖ్యము-విషయమించుకయోచించుచుంటివ ॥విం॥
అ॥ప॥ బంటుతనమున నైజామ్ పైకముఁ-బంపఁబోవిదిన్యాయమంటివ? ॥విం
మి॥ తొంటినీమగౌరవమునిల్పు-కొంట కిపుడైన వేగిరపడు
తంటాల్వచ్చులేకున్న నినుఁ-దానీషా యుపేక్షాదృష్టివిడఁడు ॥విం॥
(1) ఎన్ని పాకులఁబన్ని చెప్పుచు-నున్న తేఁడొకకన్న నీపయి
మాన్నెయుంచుట దానఫలితం-బున్న దిన్నాళు తోఁచకున్నవి

క్రన్నన నేమిలో నొక్కొక పత్రము-కన్న గడువు లేదు సరుకొనఁ
జెన్న మొత్తమెంతో? యాబదిలక్షలన్న, మాకుజవాబు జరూరిగోపన్న ||వి||

గీ|| పిడుగుమొత్తమ్ములనఁగఁ దోఁచెడు విశేష
ములకుఁ దావగు నాకమ్ముఁ గలయఁ జూచి
తెలుపుఁ బొందక గుండె నిబ్బరముతోడ
వ్రాసెఁ బ్రత్యుత్తరము రామదాసుఁ డిట్లు

సీ|| గుర్తింగనైన మిగుల్పఁగ లేను నే
నాబదిలక్షల నైకమందు నిజము
హిందువులైన తానిది మెచ్చకుందురా?
మన రామచంద్రుని మనసుఁ గోరి
గుళ్ళుగోపురములు, గురుతరమండప
ప్రాకారములు వస్తువాహనమ్ము
లేర్పాటుచేయ వ్యయించితినది, యింక
కలుఁగఁబోదు మదీయ ఖర్చుపత్రమందు.

గీ|| నమ్మకుండిరో లేదో మీర లింతకునువచ్చి
చూడవలెఁగాని నేఁ జెప్పఁ బాడిగాదు
నేఁడు భద్రాచలంబు సందేహమేమి?
కలియుగ వైకుంఠమే యన్నఁ గలయుఁ గాదె?

మ|| ఒకరూకెట్టులో వీలుచేసుకొనిరం, డున్నంతకున్ దీరబో
విఁక కార్యంబులు; దానికేమిసరి, తామే తెంచుచో తేనిద
ప్పకఁ దోడ్తెత్తురు కాదె యియ్యెడకు నేఁ బ్రార్థించినానంచు వా
రికి ముఖ్యంబుగఁ జెప్పి నాకు మఱి మీరే పెద్దలన్నింటికిన్.

అనుచు లేఖను ముగియించి యంపదానిఁ
జదివి మంత్రులు సంభ్రమాశ్చర్యచకితు
లగుచుఁ దెలిపిరి, తమకు వేఱుగతి లేమి
కలతెఱఁగు ఱేనితోడ నూర్పులనిగిడ్చి.

## —♦ మంజరి-అఠాణా ♦—

అవ్వార్తఁగినిసి నవాబు తనసా-మ్యాకృతిఁదృటిలో మార్చి
దివ్యతోమిడుతకాటలా? అరే-దివానా! యనుచునార్చి
,,రామాదాసు నిటకీడ్చితెండు హా-ర్కారులార! మీరేఁగి
తామసమున నెటులున్న వానినటు-తన్ని రాఁడొ పడలాగి
పొం'' డనుచుమోము కెంపుగదుర బొమ-ముడిపాటునముదలిడఁగ
గండు మిగిలి వారటఁజేరుచు నా-గ్రహావాజులపై వడిగ.

శా॥ పోఁగాలం బదియేమొ! తద్భటులు తప్పొప్పెయోజింప, క
ట్లాగారంబును జుట్టుముట్టుచు, నిజామాజ్ఞన్వినంబల్కి ,,రే
బేగీఆవరె! బొమ్మ్ర'' నంచు మిగులన్ బీడించుచో రామదా
సాగుండొక్క-క్షణంబు నాకు గడువీయఁ జెల్లునం చత్తరిఁ.

గీ॥ విచ్చుకత్తులఁ బహారాలనిచ్చి భటులు
తన్ను వెన్నంటిరా, రామసన్నిధాన
మునకుఁజని వానియడుఁగుదమ్మ్రలకుఁ దనివి
సనగ మ్రొక్కుచు వేడె నంజలిఘటించి.

## —♦ కామవర్ధని-చతురశ్రగతి ♦—

స॥ నీమహిమ బ్రహ్మాదులున్ దెలియ-నేర,రే నెంతవాఁడరా రామ ॥నీ॥
అ॥ప॥ కోమలాంగ! త్వత్సంకల్ప మేది-యో మేలుకొ అకె కాదె గుణధామ॥నీ
(1) దయయుంచుము పోయిపత్తుఁద్వరని-దర్శనభాగ్యము మరలఁగలిగించు
భయమేటికి? నీవండనిల్చి కా-పాడుచుండ నన్నెవఁడు వెఱపించు॥నీ
(2) పాలముంచు, నీటముంచు,-నేనీ-పాలఁబడితిఁగద జానకీరమణ!
కేలుమోడ్చి పరుల వేడఁజాలి నా-కీర్త్యపకీర్తులు నీవె భవతరణ! ॥నీ॥

ష॥ కష్టమేయనుము రాఘవ! తప్పదింక నీ
వటనిట మాసేవ మరయుమయ్య

మత్సి, శెట్టిబాగులమనిషి యిల్లా, లింట
నాడతోడుగ నుండుమమ్మ సీత!
తరిఫీదుచేయు మెంతయు రామభక్తి, మా
చిన్నిబిడ్డను హనుమన్న! నీవు
ఆలయంబున లక్ష్మణా! లోటుపాట్లేమి
రానీకఁ జూచు భారంబునీది.

గీ॥ మగిడివత్తునో, లేదొ, యేపగిది తోఁడు
దండనవిధించునో తోఁచకుండెఁగాని
యేదియెట్లైన, మాకాప్తహితులు మీరె
సెలవునయ సేయుఁడింక నిశ్చింతఁబోదు.

—♦ ద్విపద ♦—

అనివేడునంతలో-నా అటవచ్చి
కనులనీర్వదగాఁ-గని శోకమెచ్చి

—♦ పున్నాగతోడి-మిశ్రగతి ♦—

ప॥ జీవితేశ! సైచుటెట్లు? దైవ-మీవిధిఁగూర్చనిక్కట్లు

అ॥ ప॥ రావణారిపదరాజీవసేవనిన్-గావఁజాలదేమికర్మమో నా సామి॥జీ

మి॥ తావకీనవియోగజలధిఁ-ద్రోవఁగన కల్లాడుమని విధి
భావించి నాముఖమునన్ మ్రూఁడు-పంక్తులన్ లిఖియించెనా నేఁడు॥జీ

(1) ఎట్టియిడుమలఁబెట్టనుండెనో, తానిపా-కెంతక్రోధము మదినించెనో
కట్టా కనికరమింతచూపునా? నాకుఁ-గ అపరితాపముఁ బాపునా?
పట్టుదల తనకేమో? కాకీ-పైకమగునొకో పెద్దబాకీ
రట్టురవ్వలకొఅకె గాని-పొట్టకని తిట్టిమా పోని॥జీ॥

చ॥ అనిదురపిల్లు నాలిఁగని ఆంగన! చూడు నదీప్రవాహమం
దునఁబడిపోవు కట్టియలతో సరిపోల్పఁగవచ్చుకాదె? యీ
మనుగడజీవసంతతిః రమాపతి సత్కృపఁబూని కర్మమ్ములన్
మనలనుగల్పనేమొ! ధృతిమాలకు మీగతి శేలవైకడన్.

గీ॥ కలికి! నేనెట్టులకట, రాఘవవియోగ
కష్టమిప్పుడు సహియింపఁగలిగినానొ
అటులె నాతోడియెడఁబాటు నెటులొ సైచి
యుండవలె నీవు, దారిమఱొండులేదు.

చ॥ మధుకరవృత్తితో మనుఁడు: మానిని! నీవును బిడ్డఁడిప్పుడే
విధమునసైన లోటుకనిపింపదు. గ్రామముచాలమంచి, దిం
దధమము రెండుపొట్టలకు నన్నము పుట్టకపోదు, రామస
త్కథనిరతంబుఁబాడుకొని కాలము పోయిగ వెళ్ళబుచ్చుఁడీ.

చ॥ ఇఁకపయి ఖర్చుమాట వచియింపఁగ నేటికి? మేనువంచి, తీ
రికగలవేళ చేతనగురీతినిఁ దీయుమునూలుఁ; దాని బా
లకుఁడెటొయమ్మి తెచ్చును వెలన్; నిరుపేదలగోడునార్చి తీ
ర్చుకొలఁకు కల్పవృక్షమనుచు- మరుపెద్దలు రాట్న దేవతన్.

— ♦ కాంభోజి-రూపకము ♦ —

ప॥ చేరరమ్మి రఘురామా-శ్లేషణసౌఖ్యమునిమ్మా ॥చే॥

అ॥ ప॥ కూరిమి నినుఁగన్న జనకు-కొలఁకు మదిని బెంగటిలకు ॥చే॥

(1) అవినీతులఁగూడి చెడకు-మఘకూపములోనఁ బడకు
భవహరమగునీకు రామ-పాదార్చన మఱవఁబోకు ॥చే॥

సీ॥ హరి, విశ్వమయుఁడని నిరతముతండ్రితో
వాదించిగెలుచు ప్రహ్లాదుచరిత
ఆహారమాఘటిత లింగార్చనావిధి మిత్తి
వాతఁదప్పు మృకండసూతిచరిత
దృఢతరసత్తపోదీక్ష సాక్షాద్రమా
ధవుని దర్శించిన ధ్రువునిచరిత.
కొంజన్మవిడి నటరాజదేవుని సైక్య
మందవేర్చిన నందనారుచరిత.

గీ॥ పెక్కుమారులువింటివో బిడ్డ! వారు
బాలభక్తులు, తద్భక్తిభావమీవు
కైవసమొనర్చుకొనువాంఛఁగలిగి మెలఁగ
నిన్నుదీవింతు నెచ్చటనున్నసరియె.

## — మంజరి-భైరవి —

అనుచు సతీసుతులకుహితముఁబల్కి-హర్కారుల వెనువెంట
జనుచుండ జనులవ్యాత్తేత్రంబులఁ-గొనునకొనియె జాలిపంట
పుట్టెకొకబుద్ధిగా ననుకొనిరిటు-పురప్రజలు గుమిఁగూడి
పెట్టెముట్టెకూఁతలతో వెంబఱవిత్తులంచు శివమాడి.

గీ॥ మనుజుఁడైపుట్టినందు కీమాత్రమైన
స్వేచ్ఛలేదొకో? గోపన్న చేసినపని
స్వార్థమాసించికాదు; నవాబధర్మ
పరుఁడు నిశ్చయమని యతివాదులనిరి.

గీ॥ ధర్మకార్యమెకాని, యింతకునిజాము
సెలవులేకయె సొమ్ము వెచ్చించె రామ
దాసుఁడది గొప్పతప్పుకాదా? యిఁకాన
వా బనుగ్రహమని మితవాదులనిరి.

గీ॥ రామదాసునితప్పున, రానవాబు
దూరదృష్టినిపీడి దుర్మదుకుఁజూపఁ
దగదన రదేమొ! మౌనముద్రనుధరించి
చూతురు తటస్థులచలవిఖ్యాతిఁదనరి.

## — వెంబఱవిత్తులు. —

ఉ॥ గుళ్ళవష! గోపురంబులవష! గుడ్డవష! కూసవష! అబ్బా! ,,అత్తసొ
మ్మల్లుఁడు ధారవోసెనవష! అందరుభక్తులె! మోసమెన్న దుర్
వెల్లడికాకపోమనుఁడి, వెన్కనె మేమనుకొంటి, మేదియో
అల్లరివచ్చుఁదప్పదని; ఆటు ,ల' కారములన్న! మాటలా!

### మంజరి-కన్నడ

కాలినడకభయదారణ్యములటు-కడచిపదునైదునాళ్ళు
గోలుకొండ గోపన్న చేరెకడ-కుఁ నొవ్వఁగఁదనకీళ్ళు
భటులాతని నిర్దయఁదోఁసి తెచ్చి-ప్రభునికట్టెదుటనిలుప
గటములదరఁగని తానీషాయిటు-గర్జించె వెఱపుఁగొలుప

### అఠాణా-రూపకము

ప॥ ఏరయింతదుర్బుద్ధి య-దేలపుట్టెనీకు? తులువ! ॥ఏ॥
అ॥ ప॥ ధీరత మము మోసగించు-తెలివి కబ్బఁగలదు విలువ ॥ఏ॥
చ॥ కారుణ్యముమీర గుడ్డి-గవ్వకైనమారని నిను
జేరఁదీయఁబరమార్గం-బీరీతిని మాకుదక్క ॥నే॥
(1) ఆఱులక్షలపైకము నీ-యబ్బసొమ్ములైయని తింటివ?
వోరుచచ్చి తానీషా-యూరకుండుననుకొంటివ? ॥యే॥
ఆరాలన్నియుఁ దీసి-తీరెద, బందోబస్తు
జారీచేయింతుహుకుము-జప్తుగునీయావదాస్తి ॥యే॥

ఉ॥ ముచ్చఁదనంబుకొన్నడమి మోసముఁజెందితి, నాఁడు నీదు ని
పచ్చరమార్పజాలిఁగొని; బాపఁడ! వింటివె? పేనుపెత్తనం
బిచ్చిన నేను మెచ్చేసెనట! యింతకు నీతలవ్రాత తప్పునే?
రచ్చకునీడ్వఁగాఁబడి, పరాభవమందుచునుంటి వీక్రియన్.

ఉ॥ బొక్కసమా లలక్షలకు బొత్తియపెట్టిన సాహసంబు, నీ
కెక్కడనుండివచ్చె? సరి, యీపయి నీపడుపాట్లుచూడు మా
కక్కలునక్కలైనఁ గడకుఁ బడఁబోవిది నిక్కమౌర! యో
తెక్కలికాఁడ! నేఁజెఱవిధించెద నీమనియుండు నంతకున్.
కం॥ అని క్రోధమ్మెనవార్చెడు
తన తానికి వ్రొక్కి, రామదాసుఁడు మిగులన్
వినయమ్ముగదుర, నిటు భీ
తినిఁబొందక, తెగువఁబూని తెలియఁగఁబలికెన్.

# భక్త రామదాసు.

## —♦ తోడి-ఖండగతి ♦—

ప॥ మనవిఁజేకొను ఱేఁడ-కినియక్షము నీవాఁడ ॥మ॥

అ॥ ప॥ ధనము నాదనఁబోను-దాపరీఁడను గాను ॥మ॥

మి॥ మును సిరిమాటఁగట్టు-కొనిచనిరె యేరైన?
నినుబోఁటికి నాబో-ధనమొకో? మనీషివికాన ॥మ॥

(1) ఆటులక్షులవరా-లప్పుతీర్చెడిదొరా
శ్రీరాముఁడే కాని-నేరనే భూజాని ॥మ॥
పారమార్థికంబును-గోరి చేసినపనికి
కారాగారము నేఁ-జేరఁదగిన యునికి ॥మ॥

ఉ॥ మీకును నాకు, నమ్మఁదగుమిత్త్రుఁడు, రాముని బాగుఁగోరి యీ
పైకము వెచ్చపెట్టితి, నవాబుల యేల్బడిఁజిక్కి, బీదవాఁ
డైకను పట్టె దేవుఁడొకడక్కట చిన్నతనంబుకాదె? మీ
రేకద దీనసత్ఫలిత మింతకు నాపయి నింద యేటికిన్.

ఉ॥ ఓకమనీయవిగ్రహా! మదార్జితపుణ్యఫలంబుఁజేసియే
నాకిటు సావకాశము ఘనంబయె రామునిసంస్మరింప; ము
క్కాకలుతీరి గర్భనరకంబను బందిగమందు నిప్పుడీ
చీకటికొట్టుకై వెఱపుఁజెందెద నే? కడుచోద్యమయ్యెడిన్

శా॥ ఈరీతిన్ వెలపింపఁబోలునొకో? మాహిందూసమాజంబుచే
నారాధింపఁబడున్ సతంబతుల భక్త్యాధీనమైయొద్దె? ఆ
కారాగారము, కాదు, కృష్ణజననాగారంబుదారుండనై
చేరంబంచెద నేను ధన్యుఁడ నవాబ్జీ! నిన్నుఁగీర్తించెదన్

గీ॥ దాశరథి దివ్యపాదపద్మంబులాన
కల్లకాదొక పూచికపుల్ల విలువఁ
జేయఁగల ఆసియైన నార్జింపలేదు
కాపురంబద్దెయింట నిక్కముగ మ

గీ॥ కలుగునిల్లాలిమెడను మాంగళ్యమొకటి
ఆర్ష సంతతిశుద్ధి పూజ్యంబు, దాని
జోలిపోకుఁడు మీకిదె కేలుమోడ్తు
జప్తుకింకేమికలదు? నిజామువర్య!

ఉ॥ మానవనాథ! యిట్టులనుమానమునీమది నుద్భవించి, యు
గ్రానలతైక్ష్ణ్యమూనె; నుడు కారని త్వమ్రిధిల్ప్రవాహమం
దే, నడియాసఁగూలి నశియించెద, రాముఁడుమిన్నకున్న; పు
ణ్యానికిఁబోవ పాపమెదురైనది; యేమనవచ్చు దుర్విధిన్.

గీ॥ కలయర్థాగము దాచక తెలిపెనట్లు
కాని, కఠినాజ్ఞ నేఁడనుకంపవీడి
చెఱనుదోయింపఁ, దనకు శ్రీవరుఁడెదిక్క
టంచు రాఘవునిట్లు ప్రార్థించె నతఁడు.

—♦ సింహేంద్రమధ్యమ-రూపకము ♦—

ప॥ నమస్కారమిదోనయ్య-ననుఁబ్రోవుమ రామయ్య ॥న॥

అ॥ ప॥ శ్రమఁబెట్టఁగనేల? భక్త-చయమనోఽనుకూలశీల ॥న॥

మి॥ పామరమతి నతులపాప-బద్ధుఁడ రవివంశదీప!
కామితమందారా! నను-గన్న మనసుకరగదేర? ॥న॥

(1) అవధరించు నావిన్నప-మజ్ఞానముఁబోనడుంచు
భవబంధము లెల్లఁద్రెంచు-పాతకముల ష్నించు ॥న॥
శివకేశవతత్వనామ!-సీతాహృదయాభిరామ
ధవళయశోనిధి! దీక్షిత-దాసపాల! సుగుణజలధి ॥న॥

గీ॥ అటుల శ్రీరామదివ్యనామామృతంబు
శ్రోత లమరత్వసిద్ధి సంస్తుతి గడింప
భ్రమ్మరించుచుఁజేరె బందిగ, మది భువి
జముని వీటికిఁబ్రాంతినిధ్యమువహించు.

సీ॥ దుస్సహాజారత్వదోష నివారణో
త్సాహులై భార్యలఁజంపువారు
ఇనుపపెట్టెలఁజిక్కుకొని మూల్గు సిరిచెఱ
విడిపించుచోఁ బట్టుపడినవారు
తతవిప్లవప్రతిష్ఠిత రాజవిద్రోహ
చింతఁ బ్రచారముల్ సేయువారు
కనుఁబ్రామి మూఁడుముక్కలయాటఁ బెరుపరి
చేతి కీలమువదల్చు జాతివారు.

గీ॥ మత్తుఁగొనఁద్రావి, యాంగ్రవాఙ్మయసముద్ధ
రణపు బూతునిఘంటువుల్ వ్రాయువారు
తదితర ఘోరపతితసంతతులఁ గలిగి
కరలు నాబందిఖాన క్రిక్కిరిసియుండె.

గీ॥ అందుఁగన్గొను మతఁడె గోపన్నమంత్రి
లేఖినీ! వానిప్రతిమఁ జిత్రింపఁగలవ?
పదములఁ గూర్చి యిటు మషీపంకనైల్య
మడఁ[illegible]నక్కట కన్నీరువిడుతువేల?

సీ॥ లలితోర్ధ్వపుండ్రధారణఁజేసి కలకల
లాడుమోమదియెంతో వాడువాఱె
పంచపింజలువోసి బట్టఁగట్టెడితీరు
మట్టులాగునఁజిక్కి మాయమయ్యె
ఉత్తరీయమ్ము యజ్ఞోపవీతమురీతి
వైచు నేర్పుపుడు జుబ్బానడంగె
నిగళశృంఖలబంధనియతిఁ గాళ్సేతుల
కడబాటులేని పొత్తుదరఁగె.

గీ॥ చోడియంబలి యొకదొక్కశుద్ధిఁజేసె
కటకటా నేల యతనికాస్తరణమయ్యె
వక్రగామినియగు కాలచక్రమహిమ
పరమభక్తున కింతటి పాట్లువచ్చె.

శా॥ ఖైదీలందఱఁగూడఁగట్టుకొని భక్తశ్రేష్ఠుఁడా రామదా
సాదిత్యాన్వయమౌళి తారకమునందా సక్తిఁగల్గించి, త
త్పాదాంభోజము వారిహృత్సరసి నిల్పన్ జాలుటన్, మోక్షవి
ద్యాదానంబు సపాత్రవుఁయ్యెనని బ్రహ్మానందముంబొందుచున్.

గీ॥ తన్ను గురుభావమునఁగొల్చుచున్న వారి
చిత్తపరివర్తనకు సంతసించి, రామ
దాసు తద్బంధితులఁగూడి దశరథాత్మ
జాత్మజుఁగీర్తించెఁ జెఱసాల సందడింప.

—♦ ధన్యాసి-చతురశ్రగతి ♦—

ప॥ పరాకుసేయక మమ్మేలుకోర-పరమపురుష! శ్రీరఘువీరా! ॥ప॥

అ॥ ప॥ చరాచరాత్మకప్రకృతిసంచార!-సాధుజనావన! నగధీరా! ॥ప॥

(1) మాయామానుషరూప! ధృతచాప!-మారమణా! రవికులదీపా!
ధీయుత! మృదుసల్లాప! హతపాప!-ధిక్కృతరిపుకదనాటోపా! ॥ప॥

(2) తారకనామ? మేఘశ్యామా!-కైవల్యలామా! శ్రీరామా!
కారుణామృతకలిత సత్ప్రేమ-సూరిహృద్ధామ! సుగుణోద్దామా! ॥ప॥

గీ॥ రాజసేవకు లత్తఱి 'రామ' యన్న
బూతుగాఁదోఁచుచుంటఁ గ్రోధాతిరేక
మట్టివడ నొంటరిగఁజేయు సూహ, వేఱు
కొట్టమునఁబెట్ట, గోపన్న బిట్టువగచి.

చ॥ వలువురుఁగూడి నీదు భజనంబొనరింపఁగఁజూచి యోర్వలే
చిలిపితనంబు రాజభటు చిత్తములందెటు పుట్టె? నీవయిం
ములకయి ప్రోత్సహించితివ! దోసము; స్వార్థపరత్వమన్న భ
క్తులు సహింయింపఁబోరుసుమి! కోపమె? నేనిటులాడ రాఘవా.

గీ॥ కాంచుమెచ్చేస్వరంబున గంతమెత్తి
నిన్నుఁగీర్తింతు; నాపాట నీరవంబు

గాక, తెన్నడ్డుకొను నెనుగాలినైనఁ
జీల్చుకొనిపోయి, మిత్రుల చెవులఁబడును.

చ॥ అనియెలుఁగెత్తి పాడ, భటులాగ్రహ మెచ్చి, బిరాన రామదా
సు నివలకీడ్చి తెచ్చిరటు చూడుఁడు, రాక్షసకృత్య మక్కటా
కనులనుగ్రమ్మెచున్న. దధికారమదంబొకో? చబుక్కుదెబ్బలకుఁ
తని సహించుఁబాప మతఁ డల్లదె! రాముని కేడు దీనతన్,

## ముఖారి-చతురశ్రగతి

ప॥ కన్నతండ్రి! నన్నిపుడు వీరెట్లు-గాసిఁ బెట్టుచున్నారో కనిపట్టు

అ॥ ప॥ నిన్నుగానట్టులూరకొనకురా-నిరవధిసుఖదాయక! యడ్డుపడరా॥

(1) మకరి నిగ్రహించి కరినిఁగాచినాఁడను-మాటబూటకం బనిపించుకొనకు
సికపూపువాడకుండ ప్రహ్లాదు-చేటుఁదీర్చినాఁడను బిరుదువిడకు॥

(2) కనుము నావీపుపెట్లి రక్తమెటు-కాల్వఁగట్టెనో నీవొక్కమారు!
వినుము నా మొఱ; నీసాధుహస్తమున మేనునిమర నాబాధతీరుఁ॥

సీ॥ ఒకయింటివానిఁజేయును నిన్ను నెడియూహ
కాకకుజన్మంబుఁ గాచినావ?
'అడుగొంతుకహాయి' యని యొయాపెనుతి కొస
వడి, యహల్యాశాపముడిపినావ?
అడుగఁడు రేవుకేవని గుహునకుఁ దర
జోపాయ మాక్రియఁజూపినావ?
కడుపుకక్కుర్తి నక్కుట యెంగిలిడ దిని
మెచ్చి శబరికి మోక్షమిచ్చినావ?

అంతమాత్రము నెనరు న్యాయంబులేద?
కుడిచికూర్చుండలేక నా? యిడుముఁ దెచ్చు
కొంటినో రామచంద్ర! నాకంటిదీను
నిట్లుపేక్షించి-శీతకన్నిడుట తగునె?

గీ॥ ద్రౌణిబాణానలజ్వాలఁ దాఁకనీక
చక్రమడ్డిడి శ్రీరామచంద్ర! తొల్లి
ఉత్తరాగర్భరక్షణోద్యోగసరణి
నభయమిచ్చినమాట సత్యంబు కాద?

మ॥ స్మృతియున్నంతకునట్లు భద్రనగవాసీ! పాహిమాం! పాహిమాం!
గతినీవే"యనియేడ్చి, మూర్ఛఁబడె, హాకొల్పె మైకముం బొందురా
జతిరస్కారము వాతఁజిక్కి యటు దాసశ్రేష్ఠుఁడవ్వాని కే
మతిమంతుం డపుడూతయైనిలుచు? కర్మంబు దాట శక్యంబొకో?

చ॥ కలకుఁదనంబుతో భటనికాయము వానిని జాతినేలపై
బరబరలాగుచున్ మగుడ బందిగమందునఁ బారవైచి, రే
దొరతనమైన మన్నఁగలదో యిటుచేసిన! రామదాసు క్రి
మ్మఱ స్మృతిరా రఘూత్తముని మానక బాడఁదొడంగెనీవిధిన్.

## —♦ సారమతి-మిశ్రగతి ♦—

ప॥ శ్రీరామా రామా సం-శ్రితసాపారిజాతమా ॥శ్రీ॥

అ॥ ప॥ చేరిమాటలాడ-వేరా? దాసునితోడ ॥శ్రీ॥

చ॥ కోరినావా రిత్తసంపద-కారుణ్యాలవాల! తావకపద
సారసద్వయి వినా, భవసం-సారతారణకు భక్తావన ॥శ్రీ॥

(1) మారాకతాకరా!-మంజుల వాక్పూర!
పారావారగభీరా!-పలుకే బంగారా? ॥శ్రీ॥
క్రూరకర్ముఁడననియ చేర-కుంటివో రవికులోద్ధార
తారతమ్యమ్మిటులఁజూపఁగఁ-దగున? నాపైనేటికిర పగ ॥శ్రీ॥

మ॥ వసుఁగావన్ దలకొందువేని, వినుమన్నా! నీదుసత్కీర్తి జా
టదె? వేనోళ్ళ దిగంతరంబుల, నిరటంకంబుగా భక్తర
క్షణ మారామునిసాటిదైవతముఁ డొక్కండైన లేఁడంచు నీ
వనుమానింపకు, మాటఁదప్పుదువె? దేవా! రామచంద్రప్రభూ.

కం॥ అటు రామునివేడుచు సం
కటములఁబడుచుండె, బందిఖానా, నతఁడు
దృఢభక్తిఁజేయు కృషులం
దెటులైనను మోక్షమార్గమే చింతించున్.

సీ॥ రామునినామాక్షరంబు లెల్లెక్కింపు
నేర్పుఁజూపినవచ్చు నేతలోన
ఏకాలమునలయ నీసమ్మెటన్వేయ
పాటమఁగియు నినుముపదును సెడక
సారతో నేలఁద్రవ్వఁగ నెంతలోతునఁ
దారక రత్నంబు దారసిల్లు
పనితనంబెట్టులేర్పడ, జానకీపతి
దివ్యవిగ్రహముఁ జిత్రింప నేర్తు

గీ॥ ననుచు గోపన్న కర్మాలయమున, నివలఁ
జింతను మునుంగుఁ దాఁ బనిసేయువేళ
గాని, యమకింకర ప్రతిమానులైన
భటుల యత్నాకులనిన నోర్వంగలేఁడు.

గీ॥ బాండినుకలోన వేసవిమండుటెండ
కదలకటు నిల్వుమని ఘటికాత్రయంబు
ప్రభుఁడు శిక్షనువిధియింప బాధపడుచు
దాశరధినెంచి యిటురామదాసుఁడనియె.

—♦ ఆనందభైరవి-సంకీర్ణజాత్యేట ♦—

ప॥ నీసాటివారెవరయ్యా శ్రీరామ!
నీలనీరదశ్యామ! తారకనామ!-నిరుపమబలభీమ! ॥నీ॥

అ॥ ప॥ దాసానుదాసుఁడను కాద?-నిను నే
దయాభిక్షమడుగ, నుపేక్షఁజేసె దీ?-ధరణీపలలామ! ॥నీ॥

మి॥ ఆసమీర నీకన్న వేఱు నా-
కాప్తులెవ్వరున్ లేరనినమ్మికొంటి నిటు

మోసమొదవ నగ్గాసిఁబెట్టి వి-శ్వాసమెడ నెడప
వలదని కడు వేడుచుంటి-భాసురాంగ! మునిహృదబ్జభృంగ ||నీ||

చ|| ఎవని కులంబునందు జనియించితి, వాయసహాయశూరుఁడీ
పకలు నిజప్రతాపమొక బాపనిపై నెటు చూపుచుండె! నా
రవికిఁ నివ్వ నేర్పితివొ! రాఘవ! సకతగాఁడు నేర్చెనో!
వికటమె యుంగ; సాధుజనపీడయె మీ బిరుదంబ, తెల్పుమా!

గీ|| గాలిలో నగ్ని ఖండముల్ గలిపి విసరు
క్షేత్రశైశాఖములఁగన్న జన్మభూమి
లయ్యెనా? తండ్రి! నీను నేత్రాంబుజములు
నన్ను నిల్వున దహియించుచున్న వకట.

సీ|| పలుగుటా నేలపైఁ బండుకొంపమటున్న
ఘాతుకముగు నల్లిపోతు బాధ
ఎలమిగోడకుఁ జేరగిలఁజూడ, పైనొవ్వఁ
గాఁగుట్టు నీమండ్రిగబ్బ బాధ
ఇటునటు తిరుగాడ నెంచఁ బద్మవ్యూహ
ముం బన్ని దోమలు ముసురు బాధ
వాయెత్తి యుబుసుపోవఁగఁ బాడుకొంటకు
బలిమినోర్మూయు సిభటుల బాధ

గీ|| అన్నియున్ బాధలేకదా! నన్నయ్యారె!
వెఱ్ఱివానిగఁజేసి, కబీరుమోస
పుచ్చిపోయెన? అసలు రాముఁడను దైవ
ముండెనా? యుండి, మొఱవినకున్నవాఁడ?

—♦ మాండు—చతురశ్రగతి ♦—

ప|| ఎందుడాగినావో శ్రీరామ! నా-కుందుఁదీర్పలేవో, గుణధామ! ||ఎం||

అ|ప|| సుందరాంగ! కలనైన నీవు నా-కందరాని ఫలమౌమవనియెఱుఁగ ||నె||

(1) కనికరింపవేల? నాపైనిటు-కినుపఁబూనమేలా? భూపాల!
చమువ్రమీర నిటవచ్చినా పాట్లు-గనుట కైన నెడ తెఱపిలేద? నీ||ఎం||

గీ॥ భాగ్యశాలివి! నినురాజభటనికాయ
మడ్డపెట్టునటన్న భయంబదేల?
తరణికులదీప! బంగరు తాళము చెవి
కడకుఁదెఱవదె? యెట్టిబీగమ్మునైన.

సీ॥ వేరెయేటికింక నా వెతఁదీర్ప నేఁడిటు
సాగిరాకున్న కౌసల్యతోడు
అభయమ్మొసంగి నన్నాదరింపవయేని
అనుజన్ముఁడైన లక్ష్మణునితోడు
అనుకంప నన్ను భద్రాద్రి నీపదసేవ
కంపింపకున్న సీతమ్మతోడు
నినుఁగన్నులారఁగన్గొనఁగోరు వాంఛను
చెల్లింపవేని వశిష్ఠుతోడు.

గీ॥ ఇన్ని యొట్టులఁబెట్టి నీకెన్న రాని
బాధ జేకూర్చి, పీడపరాధియయ్యె
నందురే కాని, తుదకు రామయ్యతండ్రి
నీయుపేక్షకు నిన్నుఁబ్రశ్నింపరెవరు.

—♦ కమాచి—చతురశ్రగతి ♦—

ప॥ కరఁగదనీమనసు, అదియింత-కఠినతకేడనుసు? రామచంద్ర ॥క॥
అ॥ప॥ పరమపురుష! యిట్లోర్తి,నన్యథా-శరణంనాస్తి'యటన్నగుణసాంద్ర
(1) నాఁడు రావణునిచెఱజానకిపడు-గోడుఁదీర్ప నీవెటుపలవించితి
నేఁడు నేనట్టిదుస్థితినినున్న-జాడనెఱిఁగి యేమనియూహించితి ॥క॥
(2) మాఱువలుక శేమన్న? యిటునాదు-నోరునొచ్చునటు నినుఁబిల్చుచున్న
సారసాక్ష! నీవుతలఁచుకొన్నఁ-దీరదె. నాయగడు లేకనుసన్నఁ ॥క॥

శా॥ నాయాంతర్యపరీక్ష కెంతయు ననంతా! అష్టకష్టాల ని
ట్లాయాసంబును బెట్టిచూచెదవు, ఛాయాచిత్రకారుండు, నా
నాయుద్ధాయము చెల్లఁజీవిని ప్రవాహక్రూరత, జిరమ్ము
దీయంబాని యుపేక్ష సేయునటు మందీభూతపాపేయ్యుఁడై

చ॥ కడచెనుద్వాదశాబ్దములకాలము; చాలదె? నీపరీక్ష కీ
గడు, వలనాఁడు జానకిని, గర్భవతిన్ జననింద సైపఁ బో
కడవినిరోసి పుత్రవతియై పదిరెండగు నేండ్లకేకదా
కడుదయఁజెట్టఁబట్టినది క్రమ్మఱ; నన్నటు లేలవా? ప్రభూ!

ఉ॥ పాయనికూర్మి నన్ను రఘువర్యుఁడు బ్రోవఁడెయంచు, సత్కృపా
తోయధి! మెండినమ్మికముతో మనియుంటిని గాని యిన్ని నా
ళ్లీయెడ; లేద, యీసరికి నెచ్చటనుందునో! స్వామి! నాయభి
ప్రాయము మార్చుకొమ్మనెదవా? యిటులేటికి నాన్చి చంపుటల్.

ఉ॥ నీకథలో విశేషముల నేకము, లప్పటికప్డు మెచ్చిన
శ్లోకముపట్టుకీవిని, బళే! చతురత్వముఁ జూపి, మాదృశుల్
వాకొనఁజాలనట్టి, రసవత్కవితామృతముల్కఁబోసె, వా
ల్మీకికి లంచమిచ్చితివ? 'మేలుబళా' యన నిన్ను రాఘవా.

## —♦ కాఫీ-ఖండగతి ♦—

ప॥ క్షమియింపుమా రామ-చంద్ర! పామరుఁడేను ॥క్ష॥

అ॥ ప॥ విమలమతి! నిన్నింక-విసిగింపఁగాఁబోను ॥క్ష॥

(1) నాకర్మమంచిదై-నఁగోరి నన్నీవు
పాకరక్షింప నీ-సరికె తలఁపకఁబోవు ॥క్ష॥

(2) బిందెబంగారమిడి-నింద సేయఁగ నేల?
సందర్భమెడసి కం-సాలిబత్తునిఁజాల ॥క్ష॥

॥ పలుక, విటరావు, నన్నుఁగాపాడఁబోవు
పూర్వకర్మఫలంబుతప్పనోకొ? యెరి
కైనఁ దా మనుభవింపక; దానికేమి
ఒక్కవిషయము మనవి నేయుదును వినుము.

॥ మానవుఁడు తనదు ప్రాణావసానమందు
దేనినది వాంఛఁజేయు, నదానికొఱకుఁ
దిరుగ జన్మించునటు; అట్టిదటె నవర్థ

వసుసంతతిఁగాక, తావకపదాబ్జ
యుగళిఁజిత్తంబునిలుప నన్నో మహాత్మ!
ఆక్కటికమూనిదీవించు మధమపత్త
మింతమాత్రము సహుపాయమేనినెరపు
మేనుచేసినసేవకు ఋణపడకుము.

## —♦ శ్యాహాన-రూపకం ♦—

ప॥ తల్లీ! జానకి నీకును-దయరాదా? నామీఁద ॥త॥

అ॥ ప॥ పిల్లలఁగని పెంచుదాని-యుల్లము కరుణార్ద్రముకద ॥త॥

చ॥ తొల్లి నీవుపడినపాట్ల-తో నేనిపుడొందునిడుమ
తెల్లఁబొల్చుకొన్న నీక-తెల్లముకాదే కర్తవ్యము? ॥త॥

(1) రామునకున్ గుండెలేదు-రమణీ! నీకుండకపో
దేమన! నర్ధశరీరిణి-వీవాతని కగుటయొకత
హామాటయసత్యము, కుడి-యెడమ, యెడమ కుడులైనన్
తమ హాహాచర్యమహిమ-నీమగనికిఁ గలుఁగకున్నె ॥త॥

ఉ॥ దీనదశనాట నీపతిని దిక్కుగ మ్రొక్కుగ నెంచి, కష్టసం
తానముఁదీర్చిపోవుమని తల్లిరో! వేయివిధాల నేడ్చితిన్
గాని, రవంతయేని కొనికారముఁజూపఁడు వాఁడు; చెప్పవో
జానకి! రామచంద్రుఁడు ప్రశాంతిగనుండెడివేళఁజూచి నీ
వైనను, నాడుదానిహృదయంబతికోమలమంట వింటిఁగా
దేని, హతాశ నీచెఱఁగ్రుళించి నశించెద నేమిసేయుదున్.

| పాతకిరావణాసురుని బాధసహింపఁగనోడి ఖేచర
వ్రాతము మొఱపెట్టుకొనరాఁ బతినిద్రమునింగియుండ, నీ
వాతతి వారికష్టమునివారణనేఁ జెఱఁజిక్కియేనియున్
జేతునటంచు, ధైర్యమును జెప్పిననాటి కృపారసోక్తి యా
సీతమతల్లి నామనవి సేతకుఁగారణమయ్యె నమ్మ్రమీ.

గీ॥ ఔను, మాయమ్మ సీత! మీయాలుమగలు
చదువుకొన్నార లోకపాఠశాలలోన
చాల తెలిసె; చిన్న యింటివాసాల లెక్క—
పెట్టు మీబుద్ధి; నాయుసుర్గట్టుకొనుఁడు.

గీ॥ బందిఖానానుజిక్కి—చావమను బ్రహ్మ
వ్రాత కేడ్వను; జానకీరాములొక్క—
భక్తునిడుమలఁదీర్పఁ బాల్పడక పోయి
రనెడి మీభావినిందకే నడలువాఁడ.

గీ॥ అగతిని రామచంద్రవియోగతప్తుఁ
డగుచు గోపన్న యున్మాదమతిశయిల్ల
బందిగమ్మునఁ జిత్తవిభ్రమముఁజెంది
పలుతెఱంగుల నొకనాఁడు కలవరించె.

—♦ అఠాణా—ఖండగతి ♦—

ప॥ నాకనులఁగట్టివ—ట్లే కానఁబడెడు నీ
యాకారమదిగో! రా—మా? నిన్ను విడువఁబోను—నీవాఁడను నేను ॥నా॥

అ॥ ప॥ పోకుపోకింకెట్లు—పోనేర్తు వొకద్వారమేక[illegible]దీనే
నీకడ్డునిలకుందున?—ఈతరుణము వృథాచెడఁగొట్టుకొందున? ॥నా॥

(1) ఒకటనీచేయి, యిం—కొకట నీవ్రాయి, వే
ఱొకట నింకొకటియై—రకరకంబులఁదోతువా?—ననుమాయఁ జేతువ?
ఔరా! నీవింద్రజా—లికుఁడవంచెఱుఁగ, మా
మకరక్షణోద్యోగ్య—మిఁక నైనవహియింతువా?—నామొఱ నాలింతువ? ॥నా

సీ॥ ఔనది నీమందహాసమా? ఒకచిన్న
వాతాయనమునుండి వచ్చు వెలుఁగు
నీదక్షిణాకరంబు కాదెయద్ది? కవాట
మునఁ జెక్కు—చెదరని యినుపకమ్మి
అది నీమైకాంతియా! రవి వెలుపున
నెటుదాగు కటికిచీకటులగుంపు

స్వామి! నీప్రభులకక్షమయ్యద్ది? నీగుండె
జాతికిఁజెందిన జాత్రగోడ.

గీ॥ పట్టివిభ్రాంతికాని, నాయట్టిభాగ్య
హీనుఁడెవ్వఁడు! మానులకైనఁజిక్కఁ
బోని నీవెడ! నావెఱ్ఱి మానలేక
నిన్నుతలపెట్టుచుందు మన్నించురామ.

శా॥ లాఠీదెబ్బలకోర్వఁజాల నిఁక రారాతండ్రి, వేవేగఁ దో
డ్పాటుంజూపఁగ; వద్దువద్దు, విలసద్భక్తిన్ ఘటుల్ సన్మారి
ట్లాటోపంబున మ్రోఁగియుచుండిరెటో పూజ్యంబాట కీదేవ, వి
వ్యాటన్ నీదు మహోత్సవంబున కిదే భేరీసునా! రాఘవా!

గీ॥ ప్రభునియుద్దేశమేమొ, యిప్పటికిఁజెలిపె
నిట్టువిచ్ఛిన్నగతి రాఘవేంద్రుకృపను
గోరియాచించు నంజలికొఱకుఁగాదె
కేల్గవఁదగిల్చినాఁడు సంకెళ్ళనాకు.

గీ॥ కావు[illegible]లు, చిమ్మనగ్రోవులివ్వి
తనువు కాదయ్య యిదివసంతంపుబిందె
రక్తమానె వసంతము? రామ! నీకు
వాసిఁజూపదు చైత్రోత్సవంబు నేఁడు.

గీ॥ గుజగుజలివేటికో రామ! కుండపగుల
గొట్టినటుచెప్పి, మాచెప్ప వట్టిదేమొ
నామెదడుచెడిరెూ నీదు ధ్యానమునకి
ఏమతిలనీక నన్నాచు దోమలరాద! ?

ఉ॥ వెండియుబంగరమ్ము ప్రభవించెడితావది! రత్నరాసు లుం
దుండిజనింప నేర్చు, కడకొప్పఁగ దేహమింపుగా, రెూం[illegible]
నుండగు, నట్టిమృత్తిక యనూనపదార్థము; తత్ప్రాంతంబు
కుండయుమండ నీచమనుకొందువె! [illegible].

గీ॥ మానన్న నీదివ్యమూర్తి, నుత్ఫుల్లపుష్ప
సంచయముఁగూర్చి తెచ్చి, పూజించుకొంటి
నిపుడు నీభావనామూర్తి హృదయపీఠిఁ
జేర్చి, జీవసుమాల నర్చించుకొందు.

—◆ మంజరి—జింగళ ◆—

అత్తెఱంగుభక్తవ్యస్మాదంబున-నవనిసురుం డ్లాడ
పొత్తువడవచ్చె నిమరయన్నాళ్ళ-కత టినెవానితోడ
సీతాలక్ష్మణసహితుఁడై రాముఁ-డే తెంచి కలఁదోఁచి
ఆతతప్రేమ దానునకిట్లనె-నభయహస్తముఁజాచి.

—◆ శ్రీరాగము—రూపకం ◆—

ప॥ భాగవతాగ్రణి! ననునీ-పగవానిగ నెంచకుమీ
అ॥ ప॥ వేగిరపడ కర్మమనుభ-వింపక తీరునె? వినుమీ ॥భా॥
చ॥ నే గవానావాసకష్ట-నిచయంబునఁ దవిలినకథ
బాగాములు నిజకృతక-ర్మాధీనము లనుటకెకద ॥భా॥
(1) కారాగృహమున నీపడు-కడగండ్లనుగనియు నిట్టు
లూరకుంటినని కలఁగకు-మోయి! వెల్లడింతుగుట్టు ॥భా॥
నీరీతిఫలించెఁ బూర్వ-మీవు పంజరమునఁబెట్టి
కీరమ్మును బెంచు పాప-భారమ్మిటఁ బూఁచిపట్టి ॥భా॥

గీ॥ భక్తమణి! నీదు దుష్కర్మఫలముడుల్లె
బంధనవిముక్తి నై పెల్లిఁ బడయఁగలవు
రాఘవున దప్పుతీర్చుభారము; నిరాశ
నడలకించుఁ దిరోహితుఁడయ్యె నంత.

సీ॥ తలఁకునిగ్గుల బుటేదారి పనితనంబు
కైపేయు కుచ్చుపాగాలతోడ
బలితంపు కొదమకండలకివి లోనుండి
తేలించు నంగరఖాలతోడ

"గోపనసర్కారు" గుఱుతుఁజూపెడియక్క-
రాలబిళ్ళల 'దవాలీ'లతోడ
రాచకొలంపు మర్యాదఁజెల్లించు, చెం
గావిపంచె విరుపుగట్లతోడ.

గీ॥ కాశికోశ విగింపులఁ గటితటంబు
లారని యొఱఁదాగిపేర్చు ఖడ్గములోడ
మించి, భటవృత్తిఁజేసి జీవించు నన్న
దమ్ములిర్వురు యౌవనోద్రేకరులు.

ఉ॥ చక్కఁదనంబులోన, గుణసంపదయందున, రూపురేకలం
దొక్కనిఁజూడఁజాలును, మఱొక్కని వేలుగఁజేసి చూడఁగా
నక్కఱయుండ, దన్నది రవంతగఁచామనచాయ, నారలే
లెక్కకునైన, నుత్తమకులీను, లపూర్వతిదివ్యతేజులుఁ.

గీ॥ ద్వారపాలురనంపి, నవాబనుజ్ఞ
వడసి, యొడ్డోలగముఁజేరి, బత్తిమై, స
లాములొనరింప, తేఁజబ్బురమున వారి
గాంచి, ప్రశ్నించెఁదగురీతి గౌరవించి.

## మలయమారుతం-రూపకము

ప॥ ఏదేశమువారు మీర-లిటకేటికి వచ్చినారు
అ॥ ప॥ సోదరులా? భటవృత్తి మి-మ్మాదరింతు, రేభూదారు ॥ఏ॥

రా. ల:-(1) రామదాసభటులము, భ-ద్రాచలవాసులము మేము
రామోజీ! లక్ష్మోజీ!-నామంబుల నెగడినాము ॥రా॥

[illegible]:— (2) పైసకుగతిలేని బోడి-బాపని సేవకుల మీరు?
మాసమక్షమునందు ఝూటా-మాటలాడుచున్నా ॥ఏ॥

రా. ల:-(3) నమ్మఁదతని యింట, నూడి-గమ్మొనర్పఁగోరి మేము
సొమ్మునకున్ గాదు, ప్రసా-దమ్మునకే కుదిరినాము ॥రా॥

తాః— (4) అంగిలి లేకుండఁ బ్రమింగె-నాటుల తక్షులు మాఖజాన
దొంగవాఁడు; వానిభటుల-కుంగల నేర్పెందులోన ॥నే॥

రా. లః-(5) దాపరీఁడు కాఁడు, భాగవ-తాగ్రగణ్యుఁడతఁడు చూఁడు
కాపట్యమెఱుంగఁబోఁడు-భూపతి! కడుమంచివాఁడు ॥రా॥

తాః— (6) పొగిడిన నేమయ్యె? ముక్తిఁ-బొందునె? వాఁడందుచాక
సుగపడు యోగమెది లేక-చూపించెద నామజాక ॥ఏ॥

రా. లః-(7) అప్పుఁదీర్చి యొడయనిచెఱఁ-దప్పించెద మిపుడె నమ్మి
చప్పున నెంచుకొని రక్షి-దిప్పింపుమ; యిదిగో సొమ్ము ॥రా॥

ఉ॥ కన్నకుమారులతో సమముగా మముఁ బెంచె, జవానులన్న మా
టెన్నఁడు లేక; నీతఁడట కీడ్గడగా దయ సేయకున్న, మా
కన్నులలో దరిద్రత మకామొనరింపదె? పూజ్యుఁడట్టి గో
పన్నక? యిట్టికష్టము నృపా! విపరీతము కాదె? దైవము॥.

ఉ॥ తింటిమివానియుప్పు, తరితీపు వహించిన నుండఁ బోరు మా
వంటికృతఘ్ను లిట్టితతి; వంశము నిల్చునె? ముష్టినెత్తి యిం
టింటను, నూరనూరఁగడకెట్టులొ గోపనయప్పుఁదీర్చలే
కుంటిమ; ద్వాదశాబ్దములకున్ ఫలియించెను పూర్వజన్మంబుల॥

గీ॥ భూతవైద్యాన కొంతసొమ్ము నుగడించి
మాకు సాహాయ్యపడె "హనుమన్తరావు
పంతు"లను భక్తుఁడొకఁడు, గోపనకె నుంగు
చెల్మికాఁడును భద్రాద్రిసీమవాఁడు.

మ॥ అనుచున్నంతనె మాయమున్నెను సదస్యానీక, మాయోలగ
మ్మున నేఁడొక్కఁడె జాగ్రతఁగలఁడు, నమ్ముండొక్క-స్త్రీ
[వ్యక్తి, తాఁ
గనుల జోచ్చి,యదృశ్యమయ్యెనె!తటితాంతిఁ బురాణించు, దా
ధనమాల్లిత్తు అదెట్లువచ్చెనటు, నంతావింతగా నొప్పఁగఁ.

గీ॥ వింతలో వింత కాదె? పృథ్వీవిభుండు
పూర్వజన్మప్రసంస్మృతిఁ బొంది వేగ

గద్దెడిగివచ్చి రామోజి మునుబడుగు
దమ్ముల కప్రాలి యిట్లు ప్రార్థనమొనర్చె.

—♦ చక్రవాకము-మిశ్రగతి ♦—

ప॥ పరమపావననామ! భద్రగిరధామ! త్రిజగత్సార్వభౌమ ॥ప॥

అ॥ ప॥ శరణు తారకనామ! జనకజాభిరామ! పాతకవిరామ ॥ప॥

చ॥ కరుణాకర! తొల్లిఁటి నాదు పూర్వకర్మమిన్నినాళ్ళకుఁ దీరెనా?
వరదాయక! తావకదర్శన-భాగ్యమహహా! నేటికిఁ జేకూరెనా? ॥ప॥

సీ॥ సందియమేమి? నిశ్చయము, తండ్రీ! నేను
పూర్వభవంబున భూమిసురుఁడ
కాశికాపురి కురంగట నొక్క దివ్యలిం
గార్చన, నింద్రపదానుభవముఁ
గోరి చేసితిఁగాని, కొఱవడితాలిమి
జలభాండమొండు విసరితి లింగ
మౌళి, నెన్నాళ్ళకుమాపతి దర్శన
భాగ్యలేశమ్ము చేపడమి వినివి.

గీ॥ శంకరుండట్టివేళ సాక్షాత్కరించి
కనికరంబుట్టిపడఁగ నిట్లనియె నీవు
పడ్డశ్రమమెల్ల వేగిరపాటుకతన
బూదిఁబోసిన పన్నీరుపోల్కిఁ జెడియె.

—♦ మంజరి-నాయకి ♦—

సక్రేంద్రపదవి దుర్లభమికఁ తా-నీషావై ధరమీఁద
గోల్కొందువూడిగము పలువురచేఁ గలిమి, బలిమి, మరియూర
మ్లేచ్ఛజన్మకు నీమడుతన-మ్మెక్కశతము; నన్నుఁగనుట
పాంచాభవయ్యుఁ గోబ్రాహ్మణస-ద్భక్తి మెలఁగఁగలవుట.

గీ॥ కోరి, నిర్భాగ్యముఁ జెమ్చుకొన్న, మూర్ఖ
తకువగలి, బాష్పధారఁ బాదములఁ గడిగి

దేవ! భవతారణమ్ము నాకేవిధమ్ము
కలుగఁగలదనివేడ, ముక్కంటిపలికె.

ఉ॥ „కర్మకువశ్యులెవ్వఁగనుగాని, కలంగకుమోయి! వత్స! నీ
కర్మిలి రామదర్శనమహావిభవంబు లభించు, ధాత్రి నీ
ధర్మమునిర్వహించు నెడఁ దానఁదరింతు"వటంచుఁజెప్ప నీ
మర్మ మెఱుంగఁగంటిని రమాధవ! నాపరితాపమార్పవే?

కం॥ అనవిని రామోజీ „యో
జనవర! జన్మాంతమందు సాయుజ్యంబుల్
గన్తీవు మత్కృపామహి
మను, ధారుణి నేలుచుండుమా" యనునంతన్,

సీ॥ స్వప్నమటుతోఁచెనంతయు క్షణములోన
మాయక్రమ్మట నెప్పటిమాదిరి యయి
ఆరులక్షలధనముఁ దానందుకొని, న
వాబు సంగె రశీదు గోపనభటులకు.

సీ॥ సంభ్రమానందపారవశ్యములఁగూర్ప
రామదాసును జేరి సర్కారుబంట్లు
బంధములడుల్చి యతని భూపాలసముఖ
మునకుఁగొనివచ్చి రందలమ్మెపయి, నపుడు.

శా॥ తానీషాయెదురేగి దాసుని సమీద్యత్ప్రేమ నాశ్లేషణా
మానప్రక్రియ గారవించి, కడుసంతోషమ్ముతో గద్దెనా
పీనుల్ జేసి, మృదూక్తిఁబల్కె-గుణరాశీ! తప్పుమన్నించు మ
జ్ఞానప్రేరణ సాధుపూరుషుని రోసమ్మాని కారించితిన్.

—♦ దేవగాంధారి-రూపకం ♦—

ప॥ అన్నా! నాపాప మెన్న-నలవియె? రాజసముతోడ ॥న॥
అ॥ ప॥ పన్నెండ్లేండ్లటు నినుచెఱ-బాధల నలయించినాఁడ ॥న॥
(1) అపరాధిని నీదుసత్కీ-ర్తి-యాచరణ నెఱుంగనైతి
కృపేఱుడనై భవమె కీర్తి-కిన్ గతియుని మోసపోతి ॥న॥

(2) మనయుద్ధపురిభర్తుఁడు రాముఁడని నీవు వచింపనాఁడు
వినవైతివి తద్ధర్మము గ్రహించుకొంటి నే ॥ద॥

సీ॥ రామోజి లక్ష్మోజి నామధేయులు, నిన్ను
నమ్మినబంట్లు ధనంబొసంగి
కొనిరిరక్షకు, నాకనుగవ మిరుమిట్లు
గొలుప విద్యుల్లతవలె మిటారి
రుకాలె కాన్పడి దిచ్చి మొకమయ్యెనంతలో
నదియేమి దైవమాయయొ యెఱుంగ
నల్లాను మఱపించె నల్లనిరామోజి
జ్ఞప్తికేదాపైన జరిగినపని,

గీ॥ కాని నాతాళి, పాదరత్నంబు మల్లె
బ్రోవుచెంగటనుంట యబ్బురముకాదె?
రామభక్తశిఖామణీ! నీమహాత్వ
మరయఁజాలక నేను పామరుఁడనైతి.

ఉ॥ శ్రీరఘురామభక్తకులశేఖర! భద్రనగంబునీకు జా
గీరుగవ్రాసియిచ్చితి సుఖింపుము; చైత్రమహోత్సవంబు మా
పేరనొనర్పుమీ, వలయుపెన్నిధినంపుచునుందు, మెప్పుడీ
భూరిమివృద్ధినొందమనకున్ జగదీశ్వరుఁడో ము గావుతన్.

— ద్విపద —

అనవిని, యేలిక-యడుగులవ్రాలి
వినయమ్ము మెఱయ గో-పనభక్తుఁడాలి

— సురట-చతురశ్రగతి —

ప॥ ధన్యుఁడవైతివి తానీషా! రామ-దర్శనమ్మున బహుజనపోషా ॥ధ॥
అ॥ ప॥ మాన్యచరిత! నీపూర్వపుణ్యమస-మానమహా! మృదుతరభాషా ॥ధ
చ॥ రామోజీకాఁడతఁడు, విను, దాశ-రథి; లక్ష్మోజీనామమునఁ జెల్లె
సౌమిత్రి; నీదు కనుల భ్రమముంచు-చానినిక్క-ముగ సీతమ్మతల్లి ॥ధ

(2) కడకుఁ ద్వత్పాదరజోలేశమున-కైన నీడు రానేర్తునో కో! నేను
పుడమి ఱేఁడ! నన్నుగ్గడింప కీ-పొగడ్త కింతయు నర్హుఁడను గాను ॥భ

ఉ॥ ఎన్నఁడు నాతపంబు ఫలియించి, రఘూత్తమ దివ్యమూర్తి నా
కన్నుల కర్వు తీరఁ గనఁగల్గు నదృష్టముఁ జూఱఁ గొందునో
పున్నెపుఁ బ్రోవ! నన్నెతలముంచితివంచు దపింపఁ బోకు, మే
మన్న, విధిన్ జయింపఁగలమా? సెలవీయుము పోయి వచ్చెదన్.

చ॥ అనుచు నవాబు నెంతొ కొనియాడి, బహూకృతు లంది, వేడ్కతో భ
ద్రనగముఁ జేరి, పౌరగణరంజనముం బొనరించి, యాలయ
మ్మునకుఁ బిఱుంద నాత్మసతి, పుత్రుఁడు రాఁ జని తన్మయత్వమున్
గని వినుతించె రామపదకంజములన్ నుదరాన మ్రొక్కుచున్.

## —♦ కేదార-చతురశ్రగతి ♦—

ప॥ కనికరమున ననుగాచెడి దేవుఁడ-వని నెఱనమ్మితిరా, రఘువీరా ॥క॥

అ॥ప॥ మనసిజరూప! నే మునుసలిపిన పాప-మనుభవించితిగద రా-శ్రిత
[సంచార ॥క॥

(1) కల్లజగము నాకమితానందముఁ-గలిగించు నెయ్యన్న? మేలగు నెచెలికన్న
నొల్లనొల్ల నీపద సాన్నిధ్యము-నొసఁగి ప్రోవవేల? దీక్షితపరిపాల ॥క॥

సీ॥ మాటతేటకు మాఱుమనువగు పరుషవా
గ్డిమ నన్ ఱేఁడు వాయడఁచు నాఁడు
తృష్ణచల్లారఁ గవోష్ణరక్తముఁ గ్రోల
నెంచి నన్ ఘటులు హింసించు నాఁడు
క్రిమికీటకాదు, లుత్కృష్టమానవజన్మ
మలఁతిగా నాగుండెఁ దొలచు నాఁడు
వైద్యసహాయమావంతయు లేక నే
నామయంబులఁ జిక్కి యడలు నాఁడు.

గీ॥ నన్ను వేఁగాచుకొను దారి తెన్నుఁ గనక
'పాహిమాం! పాహి!' యని స్వార్థపరుఁడనగుచు
నిన్ను శ్రమపెట్టినాఁడ, మన్నించుమిపుడు
రమ్యగుణసాంద్ర! మాయయ్య రామచంద్ర!

కం॥ ఆరీతిఁ గొంతకాలము
శ్రీరామునిసేవఁజేసి చేరె వికుంఠం
బారామదాసు భక్తిన్
దారకము జపించుకొంచు దాశరథికృపన్.

## మంగళహారతి

—♦ సురట–ఖండగతి ♦—

ప॥ జయమంగళం రామచంద్రాయ, సుగుణవి-స్తారాయ-ధీరాయ జయ [మంగళమ్ ॥జ॥

ప॥ జయమంగళం యశ-శ్చంద్రికానికరాయ, జానకీనాథాయ జయ [మంగళమ్ ॥జ॥

(1) రవివంశకలశాబ్ధి-రాకాశశాంకాయ- రాజీవనేత్రాయ - జయమం [గళమ్ ॥జ॥

భవపాశనాశాయ - భక్తవ్రజేశాయ - పట్టాభిరామాయ జయమం [గళమ్ ॥జ॥

శ్రీరాజగోపాలార్పణమస్తు.

ఉ॥ బాలుఁడు దీక్షితాఖ్యుఁడతిభక్తి మెయిన్ రచియించి, రాజగో
పాలునకంకితంబిడె, కృపాపరిపూర్ణములౌ తదీయ దృ
గ్జాలములూతగా భయదసంసరణోదధిఁదాటు; నీతివి
ద్యాలయమైన యీచ్చరితమార్యుల సమ్మతమున్ గడించుతన్.

## సంపూర్ణము

కం॥ భద్రగతి నచ్చుపని నే
ఛిద్రములొదవనటుసల్పు సీతారామా
ముద్రణశాలాధిపులు
న్నిద్రయశస్కులు కీర్తనీయులు నాకున్.

# శోధనపత్రము.



| పుట | పంక్తి | అసాధువు | సాధువు |
|---|---|---|---|
| 4 | 3 | మమమలం | విమలం |
| 6 | 24 | త్వత్కృపా | మీకృపా |
| 8 | 12 | ఝురి | ఝురి |
| 10 | 4 | పేరిడి | పేరి |
| 13 | 10 | వీవు | వీపు |
| 14 | 6 | ఫలించి | ఫలియించి |
| 15 | 9 | నిష్ట | నిష్ఠ |
| ,, | 14 | వినమ్యుఁడై | వినమ్రుఁడై |
| 20 | 25 | విద్యాదిను | విద్యయను నొక్కఁడి |
| 23 | 17 | బళీవారి | బిళీహారి |
| ,, | 21 | క్రీ | కీర్తి |
| 25 | 23 | నీదప | నీపద |
| 27 | 3 | మిరుహాముల | మిరుహామ్ముల |
| 35 | 13 | వహించి | వహియించి |
| 38 | 12 | రామా | రమా |
| 42 | 5 | రామా | రామ |
| 50 | 9 | జాత్మ | జాతు |
| ,, | 13 | పాత | పాప |
| 50 | 26 | గిరింత | గీరింతు |
| 52 | 15 | శ్రితసా | శ్రిత |
| 57 | 25 | దైర్యము | ధైర్యము |
| ,, | ,, | యె | యే |

కొన్నిచోట్ల (ఁ) పొల్లునకుమారు (ఁ) పొల్లు పడినది. ఇంకా నెఱపులున్న క్షమింతురుగాక.

